# బాలశతకము

—:o:—

## చిల్లరిగె యోగానందకవి

విరచితము.

---

సేతు ముద్రాక్షరశాల,

మచిలీపట్టణము.

---

1912.

వెల 0—2—0.

# పీఠిక

—:0:—

ఇయ్యది బాలశతకము. కేవలము బాలకుల కుప యోగించు విషయంబు లన్నియు, నిందుఁ బూనగుచ్చిన ట్లొక క్రమము ననుసరించి, వ్రాయఁబడినవి. అందులోఁగూడ, నొకవిషయమును గుఱించిన పద్యము లచ్చటచ్చట వ్రాయఁబడక, పూలగుత్తులవలె, నొక్కొకచోటనే చేర్పఁ బడియెను. శైలి మృదుమధురము. చక్కని సామెత లందందుఁ బొందు పఱుపఁ బడినవి. ఇక్కవి యుపాధ్యాయపదవిలో నారితేరిన వాఁడగుటచే, నింత రమ్యముగ వ్రాయఁగలిగె నని తోఁచెడిని. ఇక్కాలంబున శతములను మించిన శతకంబు లున్నవి గాని బాలుర విధుల నింతచక్కఁగా బోధించునవి మాత్రము లేవని గట్టిగాఁ జెప్పిన సాహసము కానేరదు. ఉండెనందుమో యే రాజనీతియో, లోకనీతియో, మధ్య మధ్య విస్తారముగా నుండుటచే, నవి బాలురకుం గలగూరగంపవలె నుండు నని, లోకజ్ఞానముగల యుపాధ్యాయు లందఱకుం దెల్లంబ, కాఁబట్టి యెలిమెంటరీ పాఠశాలోపాధ్యాయు లందఱు, నీ శతకముం దెప్పించి, తమతమ బాలుర హస్తారవిందముల నలంకరింపఁ జేయుదురని, నాయభిప్రాయము.

అంగలూరు,
ది 11–9–1912.

ఇట్లుపాధ్యాయవిధేయుఁడు,
నందగిరి శేషగిరిరావు.



# బాలశతకము.

—— :o: ——

## (కందములు.)

నిద్దురకుఁ జేరు నప్పుడుఁ
బొద్దున మేల్కాంచు నప్డుఁ ♦ బ్రోచెడి దేవున్
దద్దయు బత్తిం దలఁచెడి
బుద్ధి గలజనుండు శుభముఁ ♦ బొందును బాలా॥ 1

## క్రమపద్ధతి.

చదివెడు బాలకు లనిశం
బుదయమునకు మున్న లేచి ♦ యోపికఁ బాఠాల్
సదువుకొని దేహబాధలు
మొదలైనవి దీర బడికిఁ ♦ బోవలె బాలా॥ 2

వరగడువుతోడఁ జదువుల
బరి కేగిన గురువు సెప్పు ♦ పాఠంబుల, సు
స్థిరమతి గ్రహింప నేరవు;
త్వర నరిగెడు దానిఁ గుడిచి ♦ తరలుము బాలా॥ 3

బడినియమకాలమున కొక
గడియయు జాలంబు సేయఁ • గా రాదు సుమీ
వడిఁ జనక యున్నఁ బాఠము
చెడు, గురు వది నీకు మరలఁ • జెప్పఁడు బాలా॥ 4

## ఆరోగ్యము.

తరుణవయస్కులు గూడను
జ్వరముఖరుజ లందు చుంట • పవనాదులఁ దా
రరయక, యనుభవించుచుఁ
జరియించెడి హేతువుననె • సత్యము బాలా॥ 5

పరిశుద్ధ మైనగాలినిఁ
బరిశుద్ధం బైనజలముఁ • బరిశుద్ధాన్నం
బరసి యనుభవించిన యా
నరునకు జాడ్యంబు రాదు • నమ్ముము బాలా॥ 6

వేళకు నన్నముఁ దినుటయు
వేళకు నిదురించుటయును • విడువక తమకుం
జాలిన దేహపరిశ్రమ
వేళకుఁ బచరించు చుంట • విధి సుమి బాలా॥ 7

వసియించు నిండ్లు స్థలములు
వసనంబులు నోడలు మఱియు • వాడువదార్థం
బిను మంత ముఱికిఁ జెందిన
వసియించుం జబ్బు లచట • వదలక బాలా॥ 8

# విద్యాభ్యాసము.

బడికిం జేరిన పిమ్మటఁ
గడు శ్రద్ధగ బోధకుండు ♦ గఱపెడు పాఠా
లెడఁదం దాల్చుము, తెలియని
యెడ, గురు నడిగి తెలిసికొను ♦ మెల్లను బాలా॥ 9

అడిగిన గురుం డలుగు నను
జడుపునఁ బ్రశ్నించ వేని ♦ సందేహములన్
విడివడ నేరవు గావున
నడుగుము, నీ పాఠసంశ♦యంబుల బాలా॥ 10

చెప్పిన సంగతులను మది
నప్పసము దలంచుకొంచు ♦ నా యా పాఠా
లెప్పు డెటు నడువ వలెనో
యప్పగిదిం జదువ విజయ ♦ మౌఁ జుమి బాలా॥ 11

నీతోఁ జదివెడు బాలురు
ప్రీతిగ నిను గాంచు నట్లు ♦ ప్రేమింపుము; నీ
భ్రాత లని యెంచి, వారలు
చేతస్సంశయము లడుగఁ ♦ జెప్పుము బాలా॥ 12

నిన్నొకఁడు సేరి యడిగినఁ
గ్రన్నన నీ వెఱిఁగి నంత ♦ గాఁ జెప్పుము గ
ర్వోన్నతి, కపటము లేకయె;
సన్నుతి సేయుదురు నిన్ను ♦ ఛాత్రులు బాలా॥ 13

అర్థం బెఱుఁగని చదువులు
వ్యర్థము సుమి; చిలుకపలుకు ♦ వలె; గానం, బా
ణార్థము బోధింపఁగ, గురుఁ
బ్రార్థింపుచు నెఱిఁగి చదువ ♦ ఫల మగు బాలా॥ 14

బడి లేని కాల మందున
దుడుకుపనులు సేయు నట్టి ♦ తుంటరిమూఁకల్
నుడివెడి నుడులను నమ్ముచుఁ
జెడఁ దిరుగక, చదువుకొనుట ♦ శ్రేయము బాలా॥ 15

ఎద కిం పగుసమయంబునఁ
జదువుకొనుము, విసుగు పుట్టఁ ♦ జదువకు, మెపుడున్
మదికి విరామం బీయక
చదివినఁ, దత్ఫలము నొందఁ ♦ జాలవు బాలా॥ 16

చదువుటకు విసువు గల్గిన
వదలుచు, నా తఱిని వ్రాఁత ♦ పనిసేయుము, నీ
కది కూడఁ గష్ట మౌ నెడ
ముద మగు సద్వృత్తిఁ బ్రొద్దు ♦ పుచ్చుము బాలా॥ 17.

బోధించిన పాఠంబుల
శోధించి, తదర్థభేద ♦ సూక్ష్మాంశములన్
మేధావి యైన శిష్యుఁడు
బోధకులను బృచ్ఛ సేయుఁ, ♦ బొందుగ బాలా॥ 18

బద్ధకముచేతఁ జదువఁగ
బుద్ధి జనింపదను దొంగ♦పోక లుడుగుచుఁ
శ్రద్ధావంతుఁడ వై, పై
పద్ధతి వర్తించి, మేలు ♦ పడయుము బాలా॥ 19

## పట్టుదల.

క్రొత్తగఁ జదివెడుతఱి, నీ
చిత్తము, కడు నోర్వలేక ♦ చీకాకు పడుఁ
హత్తదు బోధయు బుద్ధికి
నత్తఱి భయపడక, ధైర్య ♦ మందుము బాలా॥ 20

ఎలుకలు కొండలఁ దవ్వును;
దొలుచును జేవగలతాళ్లఁ ♦ దొడరుచుఁ బులుగుల్;
బలు పట్టుదలను బూనిన
ఫల మొందమె మనము బుద్ధి♦బలమున బాలా॥ 21

విడువని కృషిచే, మందుఁడు
వడయు ఫలము, సూక్ష్మబుద్ధి ♦ వడయఁడు, యత్నం
బెడనెడఁ జేసినఁ బందెపు
నడకం దాఁబేలు శశము ♦ నవ్వదె? బాలా॥ 22

సులభ మగుఁ గష్టకార్యము
తలఁగక యత్నంబు సేయఁ ♦ దగ నల్పులకుఁ;
శిలమీఁద దారి పడదే?
చలిచీమలు పోవ నేక♦సరణిని బాలా॥ 23

కష్టములు సైచి కర్జము
లిష్టముతోఁ జేయు చుండ • నేరైనను దా
మిష్టములం బడయుదురా;
కష్టంబులు ముందు ఘనసు•ఖము లగు బాలా॥ 24

తనలాభమ్మున కైన, నొ
రుని లాభమ్మునకు నైన • దుశ్చితతరముగ మేల్
పను లాచరింప యశ మగుఁ
గనుగొనుమా? తేనెటీఁగ•గములను బాలా॥ 25

# దురభ్యాసములు.

ఘన సెన్నఁ బశువువలెఁ దా
ననయము ఫ్రొఁ జూచుఁ దగని • వ్యాపారములన్;
ఘన మగు మతి మరలింపుము
వెనుకకు గోపాలుభంగి • వెంటనె బాలా॥ 26

పొగచుట్టల బీడీలను
సిగిరెట్లను ద్రాఁగువారిఁ • జేరకు మెపుడున్
బొగ బీల్చ, ఊొమ్ముమాంసము
సెగచే హరియించు, బలముఁ • జెఱచును బాలా॥ 27

పొడుముం బీల్చిన, బద్ధక
ముడుగు, నిశలఁ బుస్తకముల • నోపికఁ జదువం
గడు వీ॥లను వెట్టిని బడి
బడిపిల్లలు నేర్చుకొందు • పదిలము బాలా॥ 28

అరయఁగ, చిటికెఁడుపొడు మని
మురిపెముతో నడప దడప • మూర్కొనుచున్నన్
ద్వరలో నీ కలవడు, మరి
పరు వింతయు లేని ముష్టి • పాల్పడు బాలా॥ 29

పొడుముం జిటికెఁ డిదు మటం
చదివిన యపు డెవ్వఁ డైన • నది వేయఁగ నిఁకన్
(జెడుముష్టిము కట్టించును
నుడివిన నీ మానసంబు • నొవ్వదె? బాలా॥ 30

మదిఁ గోర్కె వొడమ నెప్పుడు
వదలక, యొక పొడుముబుడ్ల • వడిఁ గొని రొండిన్
బదిలముగ నుంచి పీల్తువు;
వదలదు, ము క్కుండువఱకు • వ్యసనము బాలా॥ 31

పొడు మై పోవ గసింపక
కుడువవు కూడైన, నీరు • గ్రోలవు, చింతన్
విడువవు కలలో, జీవం
బెడబాసెడు దాఁక, దీని • నెఱుఁగుము బాలా॥ 32

డబ్బా! వ్యయ మగుఁ, బుఱ్ఱను
జబ్బా! మొం డౌను, లోన • సారము చెడుటన్
గొబ్బునఁ గండ్లకు మసకలు
ప్రబ్బుటలా! నిజము, పొడుము•వలనను బాలా॥ 33

అరయుము, పొగాకు కారం
బురగము నాలుకను రసము, నొకబొట్టు నిడన్
గరళము గ్రక్కుచుఁ జచ్చున్
ద్వరలో; నీ విషము సెప్పఁ • దరమే? బాలా?॥ 34

చుట్టలఁ గాల్చుచు నుండిన
నెట్టుదురుగ సభలనుండి • నిను బయటకు; నిం
కెట్టులు పరువని సెప్పదు?
గిట్టని కార్యముతె చెలుచుఁ • గీర్తిని బాలా॥ 35

పొడుముం బీల్చడి వారల
యుదుపులు చెడు మఱక లౌచు • నుండుట వలనన్
గడురోఁత పుట్టు చూపఱ;
కిడుములఁ బడఁ గొట్టు నిట్టి • దేటికి? బాలా॥ 36

మానుగ, గంజాయిని, గలు
పానంబును, నల్లమందుఁ • బ్రజ లలవడి, లో
మానంగ నుద్యమించియు
మానఁగలారే? కుబుద్ధి • మానుమ? బాలా॥ 37

పే కాడుట, వేఁటాడుట
పాకంబును, మృదువు దప్పి • పరిహాసముగా
నేకాలము మూటాడుట
పాకట మగు జూదమాట • వాయుము బాలా॥ 38

# సన్మార్గము.

చేయ నగు జీవకోటికి
జేయంగల మేలు, శుద్ధచేతస్కుఁడ వై;
వాయుము దుష్టనికాయము
హేయం బగు కార్యములకు నేగకు బాలా॥ 39

దారిం దప్పిన, నొప్పగు
దారిం బడవచ్చు జనపదంబుల, నీ మేల్
దారిం దలఁగిన, జనుఁ డిం
కేరీతిన్ ముక్తిసౌధ మెక్కును బాలా॥ 40

సత్యవ్రతనిరతుఁడ వై
నిత్యంబును మెలఁగు దేని నెగడెదు, భోగా
పత్యార్థుఁడ వై, పాతక
కృత్యంబుల నెఱప కుందు విందున, బాలా॥ 41

ధర్మప్రభు వగు సత్యము
నిర్మలమతి కాకర, మఘనిర్మూలం బౌ,
ధర్మచరిత్రమునకు, శుభ
కర్మల కాధార మాట, ఘన మిది బాలా॥ 42

అమలగుణసాంద్రు లగుటకు
సుమతులఁ జేరంగ వలయు సూటిగ, నెపుడున్
దమచాటునఁ గల తరులకు
ఘుమఘుమ లిడ వొక్కొ? గంధకుజములు, బాలా॥ 43

మంచియుఁ జెడ్డయు, నరునకుఁ
బంచత్వము నొందునాఁడు ♦ వచ్చు న్వెంటన్
మంచియె వచ్చిన; సుఖ మిడు
నెంచఁగఁ జెడు గైన, దుఃఖ ♦ మిచ్చును, బాలా॥ 44

తనవలె నితరులఁ జూచెడు
ఘనునకు నెన్నడును జెడుగు ♦ గాఁబోదు సుమీ
తనవలె నితరులఁ జూడని
మనుజునకే కల్గుఁ గీడు ♦ మఱి మఱి, బాలా॥ 45

మనసునకుఁ దోఁచినప్పుడ
సనఁ బో కేపనికి నైనఁ ♦ జర్చింపక ముం
దనలముఁ గని శలభంబులు
చని భ్రమచే నందు వ్రాలి ♦ సమయునె? బాలా॥ 46

బలసంపద్యుక్తుఁడ వై
తులఁ దూఁగుచు నున్న, నొరుల ♦ దూషింపకుమీ;
బలుశాఖలుఁ, బలుఫలములుఁ
గలతరు విలఁ బడదె; పెద్ద♦గాలికి బాలా॥ 47

చీఁకటి వెన్నెలలు నిశల
నేకమ్ముగ నిలువ నట్టు ♦ లెంచఁగ, సుఖదుః
ఖాకారమ్ములు పొనఁగవు
ప్రాకటముగ దీని నెఱిఁగి ♦ వర్తిలు బాలా॥ 48

చీ మంత చిన్న జీవికి
హేమాచల మంత గొప్ప • యేనుంగునకున్
దా మిల బ్రదుకఁగ వలె నను
కామం బొక టుంచు నెంచి • కను దయ, బాలా॥ 49

నీ వేతలఁపున, నేపని
గావింతువొ యొకుల; కట్లె • కల్గెడు నీకున్
దైవహితంబుగ, ఫలములు
గావునఁ బ్రాణులను దయను • గాంచుము బాలా॥ 50

## విద్య.

ఈ కన్నులు; కను, మాయా
లోకాదుల స్థూలవస్తులోలత్వమునన్
బ్రాకటనై భవధర్మప
థాకారము గాంచ నెంచ • నౌనే? బాలా॥ 51

విద్దె యను కన్నుఁ దాల్చిన
నద్దమునం దనముఖంబు • నంతను గను న
ట్లెద్ది నిజపదార్థంబో!
యెద్ది యసత్యంబొ, నీవ • యెఱుఁగుదు బాలా॥ 52

అంధుఁడు మార్గం బెఱుఁగక
యంధపుఁ గూపమునఁ బడెడు • నవ్విధి నజ్ఞా
నాంధులు సత్పథ మెఱుఁగక
బంధురదోషాయనమునఁ • బడుదురు బాలా॥ 53

చదు వనుధనము గణింపుము,
ముద మిడు ననిశంబు నట్లుఁ, • బో దెప్పట్లన్
సదమలయశ మిచ్చెడుఁ, దా
నదలని చెలి రీతిఁ దోడు • వచ్చెడు బాలా॥ 54

చదు వన, శాస్త్రజ్ఞానము
చదు వనఁ, బ్రాపిమిన్కు లరసి • సారము గొనుటల్
సదు వనఁగాఁ, జేతిపనులు
మొద లగు నవ్వానినేర్పుఁ • బొందుట బాలా॥ 55

చోరులనో, దాయలనో,
భూరమణుల దర్పముననొ , వోయినఁ బోవున్
మీఱిన, నీ ధనసంపద
యారీతిగ నౌనె? విద్య , యనునది, బాలా॥ 56

ఏదో యొక భాషావిధి
మోదముతో నేర్చి, యందుఁ • బూర్ణప్రజ్ఞా
వాది యనం జే రొందిన
చోఁ దన్నరుఁ డిహపరార్థసుఖి యగు బాలా॥ 57

## భూ గో ళ ము.

పూర్వము హిమాద్రిసీమయె
సర్వంసహా మేర యంచు • జను లాడెడు నా
పూర్వోక్తు లెల్ల నిపుడు
సర్వజను లబద్ధ మనరె? చదువుట, బాలా॥ 58

మెండగు దేశంబులచే
నిండిన, నొక ఖండ మంచు • నియమించుచు, ముం
దుండుమతీంద్రుఁ డెవఁడో, భూ
ఖండంబుల సంఖ్య, పంచకం బనె బాలా॥ 59

మనఖండం బేష్యా యనఁ
జను, దేశగణంబుతోడ • శశ్వత్కీర్తిఁ
గను, నిమ్నగాశ్రియం బై
జనసౌఖ్యావాల మౌచు • జగతిఁ బాలా॥ 60

భూగోళశాస్త్ర విషయము
బాగుగఁ జదువంగ వలయుఁ • బటములుగల త
ద్భాగముల విమర్శించుచు
నీగతిఁ బోవంగ జ్ఞాన • మెచ్చెడు బాలా॥ 61

## మైత్రి.

ఈఁడున జోడగు వానిని,
బాడిగ వర్తించు వానిఁ, • బ్రాజ్ఞుఁ, గుణీనన్
గూడికొని చెలిమి సల్పెడు
వాఁడే పో; కీర్తి గాంచు• వాఁ డిల బాలా॥ 62

సంగాతిమేఁటి దొరకిన
బంగారఁపుఁ గొండయేల? • బహుధన మేలా?
శృంగారవనము లేలా?
చెంగట వసియించి యింపు • సేయఁగ బాలా॥ 63

నవరత్నంబుల విలువయు
నవలీలగ నెంచవచ్చు ♦ నాప్తుం డను నా
నవరత్నఁపువిలు వింతని
యెవ్వ రైననుఁ జెప్పఁ గలరె? ♦ యిలలో బాలా! 64

తల్లికిఁ దండ్రికి సుతులకు
నిల్లాలికి నైనఁ, జెప్ప ♦ నియ్యకొనక, తా
నెల్లవు డెల్ల రహస్యము
బుల్లాసమునఁ, జెలి వలుకు ♦ చుండును బాలా! 65

రూపముల నిరువు రైనను
లోపల స్నేహితులు తాము ♦ రూఢిఁయయిన, స
ద్రూపము భంగిగ నైక్య
వ్యాపారముతోడ నుండు ♦ రరసిన, బాలా! 66

నెఱ నెయ్యుఁడు నిజసఖునకుఁ
గఱపును శుభవర్తనంబు ♦ గారవ మొప్పన్;
నెఱపుం గష్టము లబ్బెడు
తఱుల న్సాయంబు శక్తిఁ ♦ దాఁచక బాలా! 67

## దానము.

దానము ఫలదాయక మని
మానస మం దెంచి, తనకు ♦ మాలిన ధర్మం
బే నరుఁడు చేయుచుండునొ;
యానరునకు లేదు పుణ్య - మరసిన, బాలా! 68

యాచకులకుఁ జోటివ్వక
దాఁచిన, నరు ధన మ దేల? ♦ తగఁ గుడువక, యా
పాఁచిధన మతని కున్నే?
నోఁచికొనునె? తేనె ద్రావను సరఘు బాలా॥ 69

బీఁదలఁ గని, కనికరమున
సాదరమతి యాచు నెవఁడు ♦ శక్తికొలంది౯
మోదముగా దానం బిడు
నో? దానఘనుం డతండ ♦ యుర్విని బాలా॥ 70

ముష్టికిఁ దిరిగెడు దీనులఁ
దుష్టిం బొందింప కున్నఁ ♦ దోఁచిన దిడుమీ
యిష్టవచనాళి వారికిఁ
గష్టం బెసఁ దోఁచునట్లు ♦ కనలక, బాలా॥ 71

## ధనార్జన.

న్యాయపథంబును, మనుజుఁడు
వాయక, ద్రవ్యార్జనంబు ♦ వరుసం జేయ౯
శ్రేయం బగు; నిహపరముల
హాయిగ సుఖ మొందు, యశము ♦ నందును బాలా॥ 72

జనులకు నుపకృతి సల్పుచు
ననువున, ధన మొందు చుండి ♦ యత్యాశాపీ
డను బడక, ప్రాప్త మవు నా
ధనమున, సంతృప్తి గనుట ♦ ధర్మవు బాలా॥ 73

ప్రాప్తం బగు సంపదతోఁ
దృప్తిం జెందని నరుండు ♦ పృథ్విన్ సౌఖ్య
వాప్తుం డగునే? చూచిన
సప్తద్వీపాళి సిరి నొ♦సంగిన బాలా॥ 74

ఒకరిని సేవించెడు తఱి
నెకిమీఁడే; దేవుఁ డంచు ♦ నెదఁ గడు బత్తిన్
సుకముగ, నియమితకృతి బ
ద్ధక మింతయు లేక సేయఁ ♦ దగుఁ జుమి బాలా॥ 75

సేవావృత్తియె హీనము
భావింప, వణిజ్య, చేతి ♦ పని మధ్యమ మౌఁ
బావన ముత్తమ మౌఁ గృషి
కావునఁ, దద్వృత్తి సేయఁ ♦ గడఁగుము బాలా॥ 76

జనకార్జితధనజీవను
లనదలు, సోదర్యరక్ష♦ణాప్తు లధములం
చు, నిజార్జితధనజీవను
లనుపమఘను లంచుఁ బెద్ద ♦ లందురు బాలా॥ 77

ధన మమితముగాఁ గృషిచే
సనయం బార్జింపవచ్చు ♦ నందఱుఁ బూగడన్
జనములు; స్వాతంత్ర్యంబునఁ;
గనుకనె కృషి శ్రేష్ఠ మండ్రు ♦ గడనకు బాలా॥ 78

# ధైర్యము.

ఆపత్తు లనెడు పిడుగులు
నీపై నొకవేళఁ బడిన నిలువుము, గిరి వై
యోపిక నెంతయుఁ, దాలిచి
కాఁపాడును ధైర్యలక్ష్మి ♦ ఖ్యాతిగ బాలా॥ 79

విపదంభోనిధి మునిఁగిన
యపుడా నరుఁ దేల్చు ధైర్య ♦ మను నోడయె, తా
విపరీతం బిడు నొరులకు
నపరిమితానంద మిచ్చు ♦ నతనికి బాలా॥ 80

# ఋణము.

ప్రాణశేష మింత యున్న, మ
రణ మది నెకూరు న ట్లరయఁగాఁ బ్రజకున్
ఋణశేషం బుండినచో
గణనాతీత మగు చేటు ♦ కల్గెడు బాలా॥ 81

అప్పు గొని వచ్చి యేదియు
గొప్పగఁ జేయకుము వ్యయము; ♦ గోల్పడెదు సిరిన్
మూప్పున దీనతఁ గాంచెద
వప్పుడు మది జింత నొంద ♦ వ్యర్థము బాలా॥ 82

# మాతృస్మృతి

నవమాసము లుదరమ్మున
నెవరోకో, ని న్మోసి కనియె • నెంతో తౌంతిర్
నవవచనాలాపముల, న
డువఁ, గుడువఁ, జదువఁగఱపెఁ, గ • డుం దయ బాలా॥ 83

ఈవ కడుపారఁ దినినన్
భావంబునఁ దానె తినిన • భంగి నెవ రౌకో
భావించి పొంగు మనమున
నావనితయు మాత, కడు ద • యాన్వితఁ, బాలా॥ 84

నీ కింత జబ్బు మూడిన
శోకాతుర యగుచు నెవతె • స్రుక్కున్ బొక్కున్
బ్రాకట వైద్యాన్వేషణ
మే కాంత యొనర్చుఁ? దల్లి • యే గద బాలా॥ 85

మంకుతనంబున నీ వే
వంకరపని చిన్ననాఁడు • వడి చేసిన, లో
సంకట మొందక, యోపిక
చంకం బెట్టుకొని, తల్లి • సాకెను? బాలా॥ 86

పెద్దపురిటింటిలో నిర్
దద్దయుఁ బ్రేమించి, పుర్వ • తల బడు నని, రే
నిద్దుర బోవక, కాఁచిన
ముద్దియ ఋణ మింత దీర్పఁ, • బోదు మె? బాలా॥ 87

నినుఁగని పెంచిన, సదయులు
జనయిత్రీజనకు లందుఁ ♦ జర్చించినచో
జననికిఁ గల కష్టంబులు
జనకునకున్ లేవు సుమ్ము ♦ సత్యము, బాలా!

# పితృస్మృతి.

గైతులు వితలు దాఁచెడు
నాతెఱఁగునఁ బ్రీతి నెవఁడు ♦ స్వార్జితవిలస
ద్భూతిం గూర్చెడుని శ్రమపడి;
యాతఁడె సూ; నీకు జనకుఁ ♦ డనఘుఁడు బాలా॥ 89

అప్పుడును ముందు సుతునకు
ముప్పగునం చెంచి తండ్రి ♦ ముదుసలి యైనన్
దప్పక, నిత్యము శ్రమపడ
నొప్పుకొని ధనము గడించు ♦ చుండును బాలా॥ 90

జనకాజ్ఞను శ్రీరాముఁడు
జనకాత్మజఁ, దమ్ముఁ గూడి ♦ చనఁడే? వనికిం
గనఁడే? శాశ్వతకీర్తిని
జనకునియెడ నట్టిభక్తి ♦ సల్పుము బాలా॥ 91

# రాజస్మృతి.

జనకుం డిచ్చిన, దక్కడు
ధనసంపద నీకెంత ♦ దస్యులవలనన్

.తి పాలింపనిచో;
యకనె, పితకంటె రాజు ♦ ఘనుఁడగు బాలా॥ 92

బ్రిదుక నగు నబ్దశతమునఁ
బదునెన్మిది వత్సరములె ♦ పాలింతుర్పితల్
తదనంతర మీాప్రజలను
సదయుఁడు ధరణీపుఁడు కాఁడె? ♦ సాఁకెడు బాలా॥ 93

జనకుఁడు తనయులఁ గనునటు
జనసమితిం బుడమిఱేఁడు ♦ సదయాత్ముండై
గను చుండును సమబుద్ధిని
జనసుఖమే; తనసుఖ మని ♦ సతతము బాలా॥ 94

శిక్షితులి ల్లెంతురు, తము
శిక్షించెఁ బక్షపాతశీలుఁడు కాఁడే
యాక్షితినాథుం డని; మది
వీక్షించిన, వాని కున్నె ♦ విమతుఁడు? బాలా॥ 95

శిష్టార్థుల శిక్షించుట
రక్షించుట కాదె? వారి ♦ రాజ్యప్రజలన్
దక్షత్వంబున, రా జటు
శిక్షింపనిచో మ జెంత ♦ చెడరే? బాలా॥ 96

## గురుస్తుతి.

నూతనసంగతిఁ దెల్పెడు
జాతురియై బోధ సేసి ♦ సద్బోధకుఁ డా

పూతచరిత్రుని సతతముఁ
బ్రీతిగ మది నిల్పుకొనుట • విజయము బాలా॥

జననీజనకు లొసంగిన
ధనసంప త్తెట్టు లైనఁ • దగ్గినఁ దగ్గున్
జనునకుఁ దగ్గునె? గురు వొసఁ
గిన యా విద్యాధనంబు • క్షితిలో బాలా॥ 98

## దేవస్తుతి.

మే లిది, కీ డిది, పీ లిది
శీలం బిది, దుఃఖ మిద్ది • శ్రేయం బిది యం
చాలోచింపఁగ బుద్ధిని
జాల దయన్ దేవుఁ డొసఁగె • జనులకు బాలా॥ 99

అక్కటికంబున దేవుఁ
డొక్కొక యింద్రియముతోడ • నొక్కొకపనిఁ, దా
మక్కువపడి చేసికొనం
జక్కఁగ నిర్మించెఁ బ్రాణిసమితికి బాలా॥ 100

సంపూర్ణము.

కం॥ కందశతక మిది యోగా
నందవిరచితంబు, నంద • నానందంబుఁ
నందగిరి శేషగిరికవి
సందియములఁ బాపి, దీని • సవరణ సేసెన్॥

## శతకముం గూర్చి.

| పం. | తప్పు. | ఒప్పు. | |
|---|---|---|---|
| ౪ | దీర | దీఱ | |
| ౨ | నెన్నడు | నెన్నఁడు | |
| ౩ | మతీంద్రు | కృతీంద్రు | |
| ౨ | తాము-రూఢి యయిన | సర్వ-లోకాకర, | |
| ౧ | చోటివ్వ | చోటీ ఈ | |
| ౨ | తలబడు | తలఁబడు | |
| ౪ | బోదుమె | బోదువె | |
| ౧ | దెల్పెడు | దెల్పెడుఁ | |
| ౪ | జక్రిగ | జక్రిఁగ | |

